# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. M. 18
స్థాపితం: 1930
సంపుటి 57 సంచిక 19
2-5-1986
శుక్రవారం
12 పేజీలు: రూపాయి

# పి సి సి సింహాసనం ఖాళీ అవుతుందా?

## వెంగళరావు మంత్రి అవుతారా? రోశయ్యకు అధ్యక్షత?

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షస్థానం ఖాళీ అవుతుందా? జలగం వెంగళరావుగారికి కేంద్రంలో మంత్రిత్వం లభిస్తుందా? శ్రీ కె. రోశయ్య పిసిసి ప్రెసిడెంటవుతారా? ప్రణబ్ ముఖర్జీ ప్రభృతులపై ప్రధాని-కాంగ్రెస్ అధ్యక్షుడు అయిన రాజీవ్ గాంధీ తీసుకున్న చర్యను ఒక్క హను సంబంధించి మాత్రం కుంత శ్రద్ధలుగ్గా వట్టు తమ అభిప్రాయం చెప్పేవారుకాని, చర్చించేవారుకాని లేరు.

పిసిసి సింహాసనం ఖాళీకావచ్చునని దృఢంగావిశ్వసింపబడుతున్నది. వెంగళరావుగారు తొలగింపబడడంద్వారా ఖాళీ అవుతుందని ఎవ్వరూ భావించడంలేదు.

### మా రాజకీయ పరిశీలకుడు

మంతరావుగారుమాత్రం సమర్థిస్తూ ప్రకటనచేశా రెందువల్ల?

హైదరాబాదు కాంగ్రెస్ రాజకీయవర్గాలలో చర్చనీయాంశాలుగా వున్న ప్రశ్నలివి. ఈ నాలుగు ప్రశ్నలలో మొదటి మూటిటినిగూర్చి కాంగ్రెస్ నాయకులు బహిరంగంగానే అనుకోవడం జరుగుతున్నదికాని; రాజీవ్‌గాంధీ చర్యకు వెంగళరావుగారు ఏకారణంచేతైనా తనకు తానుగా వైదొలగవచ్చు; లేదా ఆయన కృషి ఫలించి కేంద్రంలో మంత్రి అయినా కావచ్చు. ఈ రెంటిలో ఏది జరిగినా పి సి సి అధ్యక్షత ఖాళీ అవుతుంది. అసలు వెంగళరావుగారికి సంబంధించి పి సి సి అధ్యక్షత, మంత్రిత్వం వదంతులు కొత్తగావ్యాపించలేదు; ఏనాటి నుండో గాలిలో వున్నాయి.

వెంగళరావుగారు పార్లమెంటు సభ్యులైన తర్వాత మంత్రిత్వాన్ని ఆశించగా ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవి లభించింది. అది ఆయనకు కొంత సంతృప్తిని కల్గించడమేకాదు రాష్ట్ర వ్యాప్తంగా పర్యటించి తన పాత సంబంధాలను పునరుద్ధరించుకునే అవకాశం కల్గించింది. ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షతకూడా వెంగళరావుగారు కోరుకున్నప్పుడురాలేదు. మామూలు పరిస్థితుల్లో అయితే వచ్చివుండేదే; కాని అనేకమైన శక్తులు వ్యతిరేకించినందువల్ల అది తాత్కాలికంగా దూరమై, ఎట్టకేలకు చేజిక్కింది.

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షత ద్వారా తాను రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రతిష్టను, బలాన్ని పునరుద్ధరించగలననే విశ్వాసం ఉత్సాహం వెంగళరావుగారిలో మొదట తొణికిసలాడాయి. జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుల నియామకానికి ఆయన ప్రతిజిల్లా తిరగడం, ప్రతిచోటా అఖండమైన స్వాగతం లభించడం, సభలకు ప్రజలు వేలాదిగా హాజరుకావడం వెంగళరావు

—కొరవ 7వ పేజీలో

'సర్వప్రియుడు' రోశయ్య

# జమీన్ రైతు

## ఖలిస్థాన్

అమృతసర్‌లోని స్వర్ణదేవాలయంలో దౌర్జన్యంగా తిష్టవేసి వున్న ఉగ్రవాదులలో ఒకవర్గం యుద్ధభేరి మ్రోగించింది: "పంథ్ సంఘం" పేరుతోవున్న ఈ ప్రకటన స్వర్ణదేవాలయంలోనే పత్రికల వారిముందు ప్రకటించబడింది.

ఈ నినాదం కొత్తకాదు; యుద్ధప్రకటనా కొ త్త కా దు. ఈ ఉద్యమానికి పూర్వపు సమైక్య నాయకత్వంగాని, శిక్కు జనసామాన్యంలో బలము సానుభూతికాని ఇప్పుడులేవు. ఖ లి స్తా న్ కలలు కంటున్నవారు పెడమార్గం పట్టిన కొద్దిమంది యువకులనేదికూడా వాస్తవమే. కాని ఇది వుపేక్షింపతగిన విషయమూకాదు; పరాకుగా వుండతగిన సమయమూకాదు!

ఉగ్రవాదులను, వారి విశృంఖల హింసాకాండను అదుపులో పెట్టడానికి పంజాబులోని అకాలీ ప్రభుత్వము, కేంద్రప్రభుత్వమూ, ఎప్పటికప్పుడు చర్యతీసుకొంటూనేవున్నాయి. గవర్నరును, రాష్ట్ర పోలీస్ అ ధి కా రి ని మార్చినతర్వాత పరిస్థితి కాస్త మెరుగవుతున్నదా అన్పించిందికాని, అది తాత్కాలికమే అయింది. ఈవారం ఉగ్రవాదులు ఒక కాంగ్రెస్ ఎం.ఎల్.ఏ.ని సైతం చంపారు; చివరకు బహిరంగంగా ఖలిస్థాన్ పోరాట ప్రకటన చేయడానికికూడా వారు సాహసించారు. ఉగ్రవాదులు సంఖ్యలో కొద్దిమందే కావచ్చు. కాని వారు తామనుకున్నది చేయగలుగుతున్నారు; భ యో త్పా తా న్ని సృష్టించగలుగుతున్నారు.

ఇంత కట్టుదిట్టమైన చర్యలు తీసుకుంటున్నా, కఠినంగా వ్యవహరిస్తున్నా శిక్కు ఉగ్రవాదులు ఎట్లా విజృంభించగలుగుతున్నారు? లోపం ఎక్కడున్నది? బలహీనత ఎవరిలోవుంది? పరిస్థితి మ ర లా విషమించుటకు, ప్రాణరక్షణే సమస్యకావడంకాక దే శ స మ గ్ర తే భంగమయ్యే ప్రమాదం ఏర్పడుటకు బర్నాలా ప్రభుత్వం అ ను స రించిన మృదువైఖరికి కారణం. ఆ ప్రభుత్వ శక్తిసామర్థ్యాలమీద మితిమీరినవిశ్వాసంవుంచి తాత్కాలికంగా నైనాసరేచేతులుకడుగుకున్న కేంద్రప్రభుత్వపు తప్పు తక్కువకాదన్నా ఖండించలేము. ప్ర ధా ని ఇందిరాగాంధీ ధైర్యసాహసాలు ప్రదర్శించి స్వర్ణదేవాలయాన్ని ఉగ్రవాదుల చెరనుండి విడిపించింది; భింద్రన్‌వాలే సైన్యాన్ని, ఆయుధాగారాన్ని ధ్వంసంచేసింది, ఎక్కడివారినక్కడ మూ సి వే సి ఖలిస్తాన్ నినాదాన్నిసైతం వినబడకుండాచేసింది. తన ఆత్మబలిదానం ద్వారా ఆమె పంజాబ్ సమస్యను ప్రశాంతపరచింది.

అటువంటిదాన్ని బర్నాలా ప్రభుత్వం మొదటికి తెచ్చింది. కరడుగట్టిన ఖలిస్తాన్‌వాదులను, హంతకులను జైళ్ళనుండి వదలి హత్యాకాండ పునఃవిజృంభణకు కారకమైంది బర్నాలా ప్రభుత్వం. ఉగ్రవాదులను ఏరిపారవేయబడి విముక్తిపొందిన స్వర్ణదేవాలయం ఆదిగాగల గురుద్వారాలన్నిటినీ తిరుగా వారికి అప్పగించి దణ్ణం పెట్టింది బర్నాలా ప్రభుత్వం. శాసనసభమీదకు పటపగలు దండెత్తి కత్తులుదూయడానికి, తనను కాల్చిచంపడానికి, కడకు ఖలిస్థాన్ ప్రకటనకుకూడా బర్నాలా బలహీనత, ఆయన ప్రభుత్వం అనుసరించిన సామరస్యపూర్వక విధానాలే కారణం.

ఇప్పుడిది పంజాబుకు, పంజాబులోని అకాలీదళ్ ప్రభుత్వానికి పరిమితమైన సమస్యకాదు. దేశసమగ్రతను, దేశసమైక్యతను సవాల్‌చేస్తూ డెబ్బయికోట్ల భారతీయులను ఆందోళనపరుస్తున్న, ఆవేశితులనుచేస్తున్న దాష్టీకుల సమస్య. ఇది ఒక్క అకాలీప్రభుత్వం ఎదుర్కోగలిగిందికాదు, ఎదుర్కోతగిందీకాదు; దేశమంతాకలసి ఒక్క మాటమీద ఒక్కబాటమీద నడవవలసినసమస్య. ఇక ఒక్కక్షణంవూరుకున్నా, వుపేక్షచేసినా ప్రమాదమే. పంజాబులో అకాలీప్రభుత్వం వుండవలసినఅవసరం వుంటేవుండవచ్చు; కాని పంజాబు బాధ్యతను కేంద్రమే పూర్తిగా వహించడంమాత్రం అవసరం. పంజాబులోని దేశద్రోహులను, ఖలిస్థాన్ నినాదాన్ని దేశహద్దులు దాటగొట్టాలి; పంజాబ్ మనది, ఆరాష్ట్రంలోని అందరిదీ అనిచాటాలి: ఆరాష్ట్రప్రజలు స్వేచ్ఛగా తిరిగి, కంటినిండా నిద్రపోయే ప్రశాంత పరిస్థితులు నెలకొల్పాలి. ఈ పరమపవిత్ర ధర్మనిర్వహణలో రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలకు దేశ ప్రజలందరి సహాయ సహకారాలు సంపూర్ణంగా వుంటగలవు!

## జమీన్ రైతు

1-5-1936

### నెల్లూరు ముచ్చట్లు

జనాబ్ యాహ్యాలి సాహెబ్‌గారి సంసారం మద్రాసుకు మార్చారు. దీనివల్ల ఎండల బాధేగాక పరామర్శకుల బాధకూడా తగ్గింది. సాహెబ్‌గారి జడ్జీ అపాయింటుమెంట్ వచ్చేవారంలో తేలిపోతుంది.

* * *

కాంగ్రెసు బిల్డింగుకు కొనుగోలు చేసిన స్థలం క్రయం రు 1525కుగా రు 771 లు చెల్లించారట. కొర్వపని పూర్తిచేయాలనే కమిటీవారు తంటాలు పడుతున్నారు. ఈ బిల్డింగు విషయంలో కాంగ్రెసు కమిటీవారు కుమ్మరపురుగు మాదిరున్నారు- వంటికి తగలకుండా!

* * *

సింహపురి నిప్పుపుల్లల ఫ్యాక్టరీ నెల్లూరు ముత్తుకూరు రోడ్డులో, నెల్లూరుకు మైలుదూరంలోకట్టుటకు ఫౌండేషన్ వేశారు. దీనిలోభాగస్తులు పి.టి. రాజగోపాలాచారిగారు, వేలుమొదలియారు గారు, దరిమడుగు రోశయ్యగారు, మరికొందరు కల్లూరువాసులు

* * *

జిల్లా బోర్డు మెంబర్లకు రానురాను పరోపకార పారీణత మృగ్యమై 'తమ కారోగ్యం తమకు సుఖం' అనేకాడికి తేలింది చివరకు. హెల్తు ఆఫీసరు గుండవోలు, ఆదూరు పల్లెల్లో బావులు త్రవ్వాలని ప్రపోజలు పెడితే నల మోరు సర్వారెడ్డిగారు అడ్డుపడి తన పూళ్ళో త్రవ్వమన్నాడటనే, స్వార్థ త్యాగంతోనా?

### 50 ఏళ్ల క్రితం ఈవారం

### సినిమావార్తలు

ఇప్పటికి తెలుగులో తయారై విడుదలైన టాకీలు 22.

1-2 సతీసావిత్రులు, 3.పాదుకా పట్టాభిషేకం 4. భక్త ప్రహ్లాద 5. శకుంతల 6-7 రామదాసులు 8. నరకాసురవధ, 9. అహల్య, 10. తులాభారం 11.సీతాకల్యాణం 12. చింతామణి 13. సక్కుబాయి, 14. భక్తకుచేల 15. లవకుశ 16. సతీ అనసూయ 17. హరిశ్చంద్ర 18. కృష్ణలీల 19. రాణీ ప్రమీల 20. భక్తకబీరు 21.ద్రౌపది వస్త్రాపహరణం 22. ద్రౌపది మానసంరక్షణం.

ఇండియాలో వుండే సినిమా థియేటర్లు 675. యునైటెడ్ స్టేట్స్‌లో 15000; ఇండియాలో సినిమా వ్యాపారంమీద పెట్టుబడులు 3 కోట్లు, యునైటెడ్ స్టేట్స్‌లో 500 కోట్లు.

### వెంకటగిరి కథలు

తాలూకాఫీసు మల్గాంలో, తహసిలుదారుని నగరు వెల్లిపూడిలో- బాగానేవుంది పరిపాలనావిధానం.

* * *

వెంకటగిరి ఎస్టేటులో ఏ యధికారి కేపవర్సుండేదిఎవరికీతెలియదు. వెంకటగిరి తాలూకా ఆఫీసు గుమాస్తా కాళప్పను రెవిన్యూ ఆఫీసరు సస్పెండ్‌చేసి, కాపీ దివానుకుపంపాడట. దీన్నిబట్టి దివాన్ అధికారాలేమిటో తెలుసుకోండి!

* * *

ఇటు ప్రజలకుకాని, అటు ఎస్టేటుకు కాని ఏమేలు చేయడానికి అధికారంలేని ఈ దివానుగిరికంటే లక్షణంగా రిజిగ్నేషన్ పెట్టి 'మడిదున్నుక బ్రతకవచ్చు మహిలోసుమతీ' మేలుగదా యని మా యభిప్రాయం. ★

# నెల్లూరు రోడ్లకు చీకటే గతా?

నెల్లూరు మునిసిపాలిటీకి కౌన్సిల్ ఏర్పడినతర్వాత వీధిలైట్ల విషయంలో ఎంతో అభివృద్ధి కన్పించింది. కాంట్రాక్టుల్లో కమిషన్లకోసం కొట్లాడుకుని ఎంత భ్రష్టుపట్టినా కౌన్సిలర్లు, వీధిదీపాల విషయంలోమాత్రం పోటీలుపడి పనిచేశారు. ఉమ్మారెడ్డిగుంట, వెంగళరావునగర్ వంటి దూరప్రాంతాలనుకూడా ట్యూబ్ లైట్లతో తళతళలాడించారు.

అయితే కౌన్సిల్ రద్దుతో మునిసిపల్ సిబ్బంది లైట్లసంగతి విస్మరిస్తున్నారు. బల్బుకాలిపోతే, దానిసంగతి అంతే. నెలలతరబడి మార్చేవారే వుండటంలేదు. టౌనంతా చీకటిగుయ్యారంవలె తయారౌతూంది. పెన్నాబ్రిడ్జిమీద 36 లైట్లుండాలి; కానీ అరంటే ఆరే వెలుగుతున్నాయి. బ్రిడ్జిపైన సిమెంటు బండలు లేచిపోవడంతో చీకట్లో నడిచిపోయేవారు గుంటల్లోపడి కాళ్ళు విరగ్గొట్టుకుంటున్నారు.

లక్ష్మీపురంలోని మూడు వీధుల్లో దీపాలువెలిగి మూడునెలలైపోయింది. శెట్టిగుంటరోడ్డు, సాలెవీధి, పప్పులవీధిలో సగభాగం చీకటి రాజ్యమేలుతూంది. దండువారివీధిలో ఒక్కలైటుకూడా వెలగడంలేదు. పొగతోట పరిస్థితికూడా అంతే. దర్గామిట్టలోని పలుకాలనీలలో అంధకారం అలుముకొనివుంది.

నెలలుగడుస్తున్నా ఒక్కరోడ్డులోకూడా కాలినబల్బులు మార్చలేకపోతున్నారంటే కారణమేమిటి? లైట్లులేవా? సిబ్బంది పని చెయ్యడం మానుకున్నారా? కమీషనర్ గారూ ఒకరోజు రాత్రి టౌనంతా తిరిగి పరిస్థితి పరిశీలించాలి.

నెల్లూరు -బాబు




## పోలీసులకు లంచాల జాఢ్యం వదలదా?

నెల్లూరు టౌన్‌లో వాహనచోదకులను

—కొరవ 12వ పేజీలో

## నేను-మీరు

## ముత్యాలమ్మ కాదు- తాళమ్మ

గూడూరు వార్తలో, గూడూరు గ్రామదేవత ముత్యాలమ్మ (20 11.85 సంచిక) అని వ్రాశారు. కానీ ముత్యాలమ్మ కొన్ని గ్రామాలకు ముఖ్యమైన దేవత కాని, నాకు తెలిసినంతవరకు గూడూరు గ్రామదేవత కాదు. గూడూరు గ్రామానికి 'తాళమ్మ' దేవత; ఆమె దేవాలయం చల్లకాలువకు ఉత్తరంగా రైలు రోడ్డుకు ట్రంకురోడ్డుకు మధ్యలో వుంది. ప్రతి సంవత్సరం ఒకదినం తాళమ్మ దేవతను గూడూరులో ఊరేగించేవారు.

మరోవిషయం- నా చిన్నతనంలో తాళమ్మ గురించి ఒక కథ ప్రచారంలో వుండేది. మా వీధిలో (తూర్పువీధి మండపం దగ్గర) ఒక రెడ్డి రైతు (మనుబోలు కుటుంబానికి చెందినవాడు) జ్ఞాపకం) మధ్య రాత్రివేళ పొలానికి పోతూ

-కొరవ 12వ పేజీలో

# ఆర్టీసీ బస్సులకు అవసరాలే ప్రాతిపదిక కావాలి!

కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ వచ్చిన తర్వాత, బస్సురూట్ల మంజూరు అతి వేగంగా జరిగిపోతూంది. గ్రామస్తులు స్వయంగా కలిసి, తమ అవసరాలు, అవస్థలు విన్నవించుకుంటే చాలు, అందులో ఏమాత్రం వాస్తవం వున్నా కలెక్టర్‌గారు వెనుక ముందు చూడకుండా కొత్తరూట్లు మంజూరు చేస్తున్నారు.

ప్రభుత్వ నిబంధనల ప్రకారం కొత్త రూట్‌లు మంజూరైనప్పుడు, ప్రథమ అవకాశం ఆర్. టి. సి. కి ఇస్తారు; వారు నిరాకరిస్తేనే ప్రైవేటు బస్సులు అనుమతిస్తారు. ఆర్. టి. సి. కి కూడా అన్ని రూట్లలో సర్వీసులు నడపడం అలివికాని పని. అది లాభదాయకం కాకపోవడమే కాదు, బస్సులుకూడాచాలినన్నివుండాలి, అందువల్లే చాలా కొత్తరూట్లలో బస్సులు త్రిప్పడానికి అధికారులు నిరాకరిస్తు

## జిల్లా వార్తలు

న్నారు. కొన్నింటిని స్వీకరిస్తున్నారు.

అయితే ఈ స్వీకరణ, నిరాకరణల అవసరాల ప్రాధాన్యతనబట్టి జరిగితే అటు ఆర్.టి.సి.కి, ఇటు ప్రజలకుకూడా సౌకర్యం. ఈ మధ్యనే ముత్తుకూరు రూట్‌లో రెండవ ఆర్.టి.సి. బస్సును ప్రవేశపెట్టారు సంవత్సరాల తరబడి చాలీచాలని బస్సు సౌకర్యంతో సతమతమైన ఈ గ్రామాల ప్రజలు ఎంతోసంతోషించారు. కాని, మొదటి ఆర్. టి. సి. బస్సుకు వున్నంత రద్దీ రెండవదానికి లేదు. చాలాట్రిప్పులు ఖాళీగా తిరుగుతూంది. ఐదు వేళల నిర్ణయంలో జరిగిన పొరపాటో, లేక అనలంత రద్దీ లేదో, లేదా ప్రైవేటు బస్సుల పోటీని తట్టుకోలేక పోతుందో తెలియదు. చూసేవారికి రెండవ బస్సు అనవసరమేమో అన్నంత ఖాళీగా తిరుగుతూంది.

అదేసమయంలో జిల్లాలో ఇంకా చాలారూట్లలో ఆర్ టి సి బస్సుల అవసరం వుంది. పొదలకూరు, చేజర్ల వంటి రూట్లలో బస్సులరద్దీ చెప్పనలవికానిది. ఇక్కపల్లె, అల్లూరు వంటి రూట్లలోకూడా వున్నబస్సులుచాలక జనం అగచాట్లు పడుతున్నారు. వింజమూరువంటి తాలూకాలలోనూ ఇదేస్థితి. కోవూరు తాలూకా పురిణి, ఇందుపూరు గ్రామాల ప్రజలు బస్సుకోసం పడేపాట్లు అమర్యవర్ణించాం.

ఇటువంటిరూట్లలో కొత్తబస్సులునడపడానికి ఆర్ టి సి ఎందువల్లనో ముందుకు రావడంలేదు. కలెక్షన్ చాలకపోవడం వారుచెప్తున్న కారణమైనా, బస్సులు లేకపోవడం అసలుకారణం కావచ్చు.

ఒక కొత్త రూట్‌కు ఆర్.టి.సి. బస్సు వస్తే దాని ఉపయోగం పలురకాలుగా వుంటుంది. ఆర్.టి.సి. తిరిగే రూట్లలో ప్రైవేటు బస్సులు రేట్లు తగ్గించడమేకాదు వేళప్రకారం త్రిప్పుతారుకూడా. ఈక్రమశిక్షణ సాధించడం కోసమైనా, ప్రతి రూట్‌లో ఒక ఆర్. టి. సి. బస్సు తిప్పడం అవసరం.

అధికారులు జిల్లాలో తమ బస్సులు తిరిగే అన్ని రూట్లపై తులనాత్మక పరిశీలన చేసి ఆదాయం సరిగాలేనిచోట్ల, రద్దీ తక్కువగా వున్న చోట్ల కొన్ని సర్వీసులు రద్దుచేసి, ప్రతి రోడ్డులోనూ ఒక ఆర్‌టిసి బస్సు నడిచేవిధంగా పునర్వ్యవస్థీకరణ చేస్తే, జిల్లాలో బస్సు ఇబ్బందులు చాలా వరకు తీరుతాయి; ఆర్. టి. సి. కూడా లాభపడుతుంది.

నెల్లూరు రీజినల్ మేనేజర్ శ్రీ మల్లన్న అత్యుత్సాహి. ఎక్కడ ప్రయాణీకులకు ఏ ఇబ్బంది ఎదురైతే, అక్కడల్లా ఆయన ప్రత్యక్షమౌతారు. ఆయన ఈ పునర్ వ్యవస్థీకరణపై దృష్టిపెడితే, ఎంతో బాగుంటుంది.

### కావలి గురుకులం

కావలిలో సదాశయంతో ప్రారంభమైన సత్యసాయి గురుకులం ఇంగ్లీషు మీడియం స్కూలు ప్రథమవార్షికోత్సవం ఇటీవల జరిగింది. శ్రీ వి. కోటేశ్వరరావు డాక్టర్ ఒబయ్య. టి. శివప్రసాద్ తదితరులు మాట్లాడారు. శ్రీమతి దీపాల వసు ధాదేవిని సత్కరించారు.

### కావలి దేశం బహిష్కరణ

కావలి శాసనసభా నియోజకవర్గం ఎన్నికలో తెలుగుదేశం అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయిన శ్రీ ఎం. వి నారాయణను పార్టీ నుంచి బహిష్కరించారు ఆయనతోపాటు. ఆయన అనుచరులైన మరొక ఐదుగురు కార్యకర్తలు- మామిడి

కాగన 10వ పేజీలో



# కోళ్ల సముదాయాలు కొంపముంచాయా?

పేదవర్గాలు, నిరుద్యోగుల సముద్ధరణకు ఉద్దేశించిన పథకాలు లబ్దిదారుల నుంచే ఏవిధంగా దుర్వినియోగంగావింపబడుతుండేది, సామాన్యప్రజల సముద్ధరణకు ప్రభుత్వం వెచ్చిస్తున్న కోట్లాది రూపాయలు ఏవిధంగా ఆశించినఫలితం ఇవ్వకుండా వృధాఅవుతుండేది నెల్లూరు జిల్లాలోని కోళ్ళసముదాయాలలో గుటకాయస్వాహా అయిన లక్షలాది ప్రభుత్వ నిధులే నిదర్శనం.

హరిజన గిరిజనులలో చదువుకున్న నిరుద్యోగులకు. చదువుకోని పేదలకోసం కోళ్ళసముదాయాల పథకం హెచ్. కె. బాబు కలెక్టరుగావున్న సమయంలో ప్రారంభమై సుజాతారావుగారి హయాంలో ముమ్మరం చేపట్టబడింది. స్థలము, షెడ్లు, కోళ్ళు, మేత, నిర్వహణ ఖర్చులు....అంతా ప్రభుత్వానిదే. షెడ్లు కట్టించడం, నీటివసతి కల్గించడం కోళ్లను పెంచి ఇవ్వడం....ఈ శ్రమఅంతాకూడా ప్రభుత్వాధికార్లదే. ఇక సముదాయపు సభ్యులుచేయాల్సిందల్లా నెలనెలకు ప్రభుత్వం ఇచ్చేభృతినిపుచ్చుకోవడం, వేళకు మేతవేసి నీళ్లుపోసి కోళ్ళను చూడడం, గుడ్లకు వచ్చినతర్వాత పెట్టిన గుడ్లను పి. ఎం. సి. కి ఇవ్వడం....ఇదీ వారి పని. ఈవిధంగా జిల్లాలోని వివిధ ప్రాంతాలలో కోళ్లసముదాయాలు ప్రారంభించబడ్డాయి.

ఆదిలోనే హంసపాదు అన్నట్లు ప్రారంభంనుండే ఈ కాంప్లెక్సులలో అవలక్షణాలూ ప్రారంభమయ్యాయి. కోళ్ళు గుడ్లకు రాకముందు మేత అమ్ముకున్నారని, తర్వాత గుడ్లు అమ్ముకున్నారని, కొన్నిచోట్ల కోళ్ళనే అమ్ముకొని సొమ్ము చేసుకున్నారనే ఆరోపణలు వచ్చాయి, ఇందులో అన్నీ నిజంకాకపోయినా కొన్నయినా నిజమని నమ్మక తప్పలేదు. ఫలితం బ్యాంకు ఋణాలు. మేతసరఫరాచేసిన పి ఎం సి బకాయిలు పెరిగిపోవడం జరిగింది. బ్యాంకులవాళ్లు జాగ్రత్త పడినట్లున్నారు; తాము పెట్టిన పెట్టుబడిని ఎస్ సి., బి. సి. కార్పొరేషనుండో మరోమార్గానో రాబట్టుకుని బయటపడినట్లున్నారు. ఇది పూర్వగాథ.

ఇప్పుడు వినబోతే కోళ్ళ సముదాయ నిర్వాహకులు వున్న కోళ్ళు అమ్ముకొని వేనకువేలు జేబులోవేసుకొని అందరికీ మొండిచేయి చూపిస్తున్నారు పి యం సి వారిదగ్గరగాని, ఇతరులుగాని ఆ కోళ్ళ సముదాయాలవద్దకు పోవడానికే భయపడుతున్నారని వస్తే తంతామని వారు బెదరిస్తున్నారని తెలుస్తున్నది. నెల్లూరు, కావలి, బుచ్చి, వావిళ్ళ, వెంకటగిరి, నాయుడుపేట వగైరా చోట్ల పది కోళ్ళ సముదాయాలున్నాయి. ఒక్కొక యూనిట్‌కు 500 కోళ్ళచొప్పున మొత్తం వీటన్నిట్లో 209 యూనిట్లు వున్నాయట; అంటే ఈ కాంప్లెక్సులలో మొత్తం లక్ష కోళ్ళువున్నాయన్నమాట ఈ కోళ్ళకు సంబంధించి ఎన్ని లక్షల రూపాయల బ్యాంకు ఋణమిప్పించారో తెలియదుగాని, పౌల్ట్రీ మార్కెటింగ్ కార్పొరేషన్ (పి ఎం సి) కు మాత్రమే పదిలక్షల రూపాయలు బాకీ వున్నారట. ఈ బాకీ వచ్చేది లేదు వచ్చేదిలేదు కాబట్టి పి. ఎం. సి. దాని ఆశ ముగించుకొని ఈ యూనిట్లన్నింటిని 'లిక్విడేటు' చేసినట్లు తెలుస్తున్నది. పి. ఎం. సి. పదిలక్షలతో బయటపడిందనుకోండి; అసలు ఈ సముదాయాలన్నిటికి బ్యాంకులైతేనేం, ప్రభుత్వసంస్థలైతేనేం ఎన్నిలక్షలు పెట్టుబడి పెట్టివున్నాయో- అదంతాకూడా గోవిందేగదా! మొత్తానికి ఈ కోళ్ల సముదాయాలు కొంపముంచి నట్లేవున్నాయి!

> **మేత తెచ్చిన బాకీలే పదిలక్షలు తేలాయట. బ్యాంకులు ఎంతకు మునిగాయోమరి!**

బాగుపడమని ప్రభుత్వం చేయి అందిస్తే, ఆ చేతినే కొరుక్కుతినడానికి ప్రయత్నించడాన్ని ఏమనుకోవాలి? ఇలాంటివారిని బాగుపరచడం పంచవర్ష ప్రణాళికలు కాదుగదా బ్రహ్మతరమైనా అవుతుందా?

ఇదిట్లావుంటే డి. ఆర్. డి. ఎ. కార్యక్రమాలది ఒక మహాసముద్రం అంటున్నారు, ఎవరెవరికి ఏఏ కార్యక్రమానికి ఎంతెంత ఇచ్చారో, అది ఎంతవరకు వుపయోగపెట్టుకోబడిందో, ఫలితాలేమిటో దానివల్ల వారుఎంతపైకివచ్చారో, ఈవివరాలన్నీ సేకరిస్తున్నారట. ఈ డి.ఆర్., డి.ఎ. కార్యక్రమాలకు సంబంధించి మరో రహస్యంకూడా వుందంటున్నారు. అప్పుల వసూళ్ళబాధ పడలేక బ్యాంకుల వాళ్ళు డి. ఆర్. డి. ఎ. సబ్సిడీలు, మార్జిన్‌మనీలుమాత్రం తీసుకొని, అప్పు లివ్వకుండానే ఇచ్చినట్లు తిరిగి చెల్లింపబడినట్లు కాగితంమీదనే లావాదేవీలు చూపుతున్నారని, దీనివల్ల డి.ఆర్.డి.ఎ. సబ్సిడీ వృధా కావడమే కాక, దాని ఆశయం కూడా విఫలమై పోతున్నదని అంటున్నారు.

ఏదైనా ప్రభుత్వ సహాయంతో వృద్ధికి రావాలనే స్పృహ, పట్టుదల ప్రజల్లో వుంటేతప్ప, ఈ కార్యక్రమాలేవీ విజయవంతంకావు. ★

# పిసిసి సింహాసనం

(మొదటి పేజీ తరువాయి)

గారిలోని విశ్వాసాన్ని ఇనుమడింప జేశాయి. కాంగ్రెస్ వాదులలోని ఉత్సాహం, ప్రజల ప్రతిస్పందన చూచిన వెంగళరావుగారికి తెలుగు దేశం ప్రభుత్వ పతనం, కాంగ్రెస్ అధికారప్రవేశం అంత కష్టంకాదనే ఆత్మ విశ్వాసం కల్గించాయి. అందువల్లనే ఆయన ముఖ్యమంత్రి రామారావును పేరుపెట్టి విమర్శించేవారు; ఆయన ముఖ్యమంత్రిత్వానికి గడువు నిర్ణయిస్తూ మాట్లాడేవారు, ఆయన ఉపన్యాసాలు వింటుంటే తెలుగుదేశం ప్రభుత్వం పడి పోయి కాంగ్రెస్ తిరుగా గద్దెఎక్కినట్లే భ్రమకలిగేది! హైదరాబాదు కార్పొరేషన్‌లో కాంగ్రెస్‌కు రెండవస్థానం రావడం వెంగళరావుగారి విశ్వాసం నిరాధారమైంది కాదేమోననికూడా అనిపించింది.

కాని శాసనసభ కాంగ్రెస్‌పార్టీమీద వెంగళరావుగారికి పట్టు లేకపోవడమే కాదు, ఆయనమాట పొత్తుగా చెలామణికాలేదు. ఆవిషయం మొన్న రాజ్యసభ ఎన్నికలలోరుజువైంది. పార్టీ అభ్యర్థికి వ్యతిరేకంగా ఓటుచేసినవారు పదమూడు మంది అని వారిపేర్లుకూడా ఉదహరిస్తూ వారిని పార్టీనుండి బహిష్కరింపజేయ గలనని వెంగళరావుగారు ప్రతిజ్ఞగా చెప్పినా అది నెరవేరలేదు. ఓటుచేసిన వారిసంగతి ఎట్లయినా, తనపట్ల బహిరంగంగా అవిధేయులుగా వుంటున్న డాక్టర్ వై. ఎస్. రాజశేఖరరెడ్డి వంటివారి నైనా బయటకు గెంటిస్తామనుకుంటే అదీ జరగలేదు. ఈ విషయంలో వెంగళరావుగారు అవమానితుడైనట్లు భావించడం సహజం. జిల్లాల్లో తాను నామినేట్ చేసిన సంఘాలు వివాదాస్పదమై బహిరంగంగానే ఘర్షణలు ప్రారంభమయ్యాయి. రాయలసీమలో తాను అడుగుపెట్టే అవకాశమే లేకుండా పోయింది. తన పిసిసి అధ్యక్షత కొన్ని జిల్లాలకే పరిమితమైపోయింది. ఈ పరిస్థితి ఆయనకు మనస్తాపం కల్గించి వుంటుంది. వెంగళరావుగారికి ఎదురులేని తనం కావాలి; అది ప్రస్తుతం కరవై పోయింది. పూర్తిగావిఫలుడైనాడనిపించు కోవడంకంటే, హెట్టుగా ఇప్పుడే వైదొలగడం మేలనే అభిప్రాయం ఆయనలో కలిగిందని అంటారు.

ఈ పరిస్థితిల్లో ఉత్పన్నమవుతున్నది ఆయన మంత్రిత్వం. దానికోసం ఆయన గట్టిగానే కృషిచేస్తున్నాడని చెప్తున్నారు; కేంద్రంలో మంత్రివర్గ విస్తరణంటూ జరిగితే వెంగళరావుగారికి తప్పక అవకాశ ముంటుందని అంటున్నారు. వెంగళరావు చాల నమ్మకంగా వున్నాడని అంటారు. కాని ఎన్నికైంది ఆంధ్రనుండి కాకపోయినా, ఇప్పటికే క్యాబినెట్ మంత్రులుగా తెలుగువారిద్దరున్నారు: అటువంటప్పుడు మూడవవారికి ఎంత వరకు అవకాశం? వెంగళరావుగారి మంత్రిత్వానికి భావ పెద్ద ప్రతిబంధకం కాదా? ఈ అంశాలు చర్చనీయాంశంగా వున్నాయి. మొన్న ఖమ్మం, గుంటూరు పర్యటనలో ఏర్పాట్లకు ప్రధాని రాజీవ్ గాంధీ ముగ్ధుడైపోయాడని, దానితో వెంగళరావుగారిమీదవున్న అభిమానం ఇనుమడించిందని, అందువల్ల వెంగళరావుగారి మంత్రిత్వానికి ఇవేమీ అడ్డంకులు కాకపోవచ్చునని కొందరి అభిప్రాయం.

ఇదిట్లావుంటే, మొన్న గుంటూరులో ప్రధానికి అనితరసాధ్యంగా బ్రహ్మరథం పట్టిన రాజ్యసభ సభ్యుడు శ్రీ సాంబశివ రావుకు మంత్రిత్వంమీద ఆశ జనించిందని, మంత్రిత్వానికి ఆయన ప్రయత్నమూ వున్నదని చెప్తున్నారు. అయితే ఆయన బహిరంగంగా వెంగళరావుమంత్రిత్వాన్ని వ్యతిరేకించడంలేదు; వెంగళరావు వైదొలగితే రాష్ట్రంలో కాంగ్రెసే లేదనే అభిప్రాయాన్ని ప్రధానికి కల్గించడంద్వారా, తనపని సాధించుకోవడం ఆయన వ్యూహమంటారు. మంత్రిత్వం వచ్చినగాని, మరేకారణంచేత నైనాకాని వెంగళరావు వైదొలగితే శ్రీ కె. రోశయ్య ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు కావడం ఖాయంకాబట్టి, అతడు అధ్యక్షుడు కాకుండడానికి వెంగళరావు పిసిసి నుండి వైదొలగకుండాలనేది సాంబశివరావు అభీష్టమనిఅంటారు. పిసిసిలోని వెంగళరావు అనుయాయులకుకూడా వెంగళరావు వైదొలగడం ఇష్టంలేదట.

పి. సి. సి. అధ్యక్షస్థానం ఖాళీ అయితే దానికి తగిన వారసుడు శ్రీ కె. రోశయ్యేనని దాదాపు ఏకాభిప్రాయంగా వినబడుతున్నది. ఆయనంటే ఎవ్వరికి వ్యతిరేకతలేదు. సర్వప్రియత్వం రోశయ్య గారి స్వభావంలోనేవుంది. అనుకూలుడని కాకున్నా ఆయన్ని శత్రువుగా ఎవ్వరూ పరిగణించరు. అందువల్ల వెంగళరావుగారు వైదొలగేట్లుంటే ఆస్థానం రోశయ్యదేనని చెప్పవచ్చు.

మాజీ ముఖ్యమంత్రి టి. అంజయ్య గారికి అధ్యక్షతమీద ఆశవున్నదట. కాని నాయకత్వం ఆయనకు మముఖం కాక పోవచ్చునని అంటారు. ★



## మే తిథులు

3 శని దశమి రా. 10-30 గం. వ.
4 ఆది ఏకాదశి రా. 10-09 గం. వ.
5 సోమ ద్వాదశి రా. 10-20 గం. వ.
6 మంగళ ప్రదోదశి రా. 10-56గం.
7 బుధ చతుర్దశి రా. 12-10 గం. వ.
8 గురు అమావాస్య రా 1-54 గం. వ.
9 శుక్ర వైశాఖ శుద్ధ పాడ్యమి రా. 3-39 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి

# పినాకినీతీరం

( వ పేజీ తరువాయి)

రంగా గా వంచేస్తారు: పెట్టనగ్గర రాజ్యేసరికి విఫలమయ్యారు. కాని రామసుబ్బారెడ్డి మాత్రం నటన-పాట రెంటిలోనూ సమాన ప్రతిభ కనుపరుస్తారు. హరిశ్చంద్రపాత్రలో అతను శివరంజని, మేచకల్యాణి రాగాలకి అదే కారణం.

ఆ రోజుల్లో మునలయ్యగారిపేరు మీరు వినే ఉంటారు. యువ ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా పనిచేశారు; రెండుసార్లు శాసనసభలో సభ్యులయ్యారు. ఆయన రాజకీయవాదేనని మొదట అనుకొనేవాణ్ణి. కుంటిగాలో విలసించిన ఆయన కమ్మని కంఠంచూచి ఆయన సంగీత ప్రియులే కాదు, మంచి పాటగాడనికూడా తెలిసికోవడం సిద్ధించింది. మునలయ్యగారికి రామసుబ్బారెడ్డి అభిమాన రంగస్థలనటుడు: హరిశ్చంద్రుడుగా రామసుబ్బారెడ్డి కంఠమాధురి ఆయన చెవికోసుకునేవారు కొన్ని హాలులో అయినాసరే మునలయ్యగారూ ఒకసారి అంటేవారు, రామసుబ్బారెడ్డి రంగం ఒకటి ఎక్కుతే ... వారు. ప్రక్కవారికి ఏసిపి చెప్పండా! మునలయ్యగారి సంగతి ఎందుకు చెప్పవలసివస్తున్నదంటే రామసుబ్బారెడ్డి కంఠం ఎంతదూరం వ్యాపించిందీ, ఎందరిని ముగ్ధులను గావించిందో తెలియజేయడానికే!

రామసుబ్బారెడ్డి హరిశ్చంద్ర నాటకం ఒకసారి రేడియోలో ప్రసారితమైంది. దూరదర్శన్, ఆకాశవాణిలు అగ్రహారాలుగావుంటున్నాయి. టి.వి లో ఏవేవో నాటకాలొస్తుంటాయి: వివిధభాషా నాటకాలూ ప్రదర్శితమవుతుంటాయి. ఒకసారి రామసుబ్బారెడ్డి హరిశ్చంద్ర వంటి నాటకాన్ని ఎందుకు ప్రదర్శించకూడదు? అట్లనే రంగస్థలపద్యాలు అంటూ నిత్యం రేడియో వినిపిస్తుంటాయి; అందులో రామసుబ్బారెడ్డి ... నెల్లూరి మునికళలు వినిపించేందుకు దూరదర్శన్, ఆకాశవాణులు ఈ పక్షపాత బుద్ధులు మానుకోవాలి: తెలుగు నటుణ్ణి మనమైనా మన్నించుకోవాలి!

పి.సి. రెడ్డి స్టు. వర్తమానసమాజం కలిసి సన్మానానికి శ్రీయుతులు పొన్నాల రామసుబ్బారెడ్డి, వి. స్వామిదాస్, వైద్యుల శ్రీనివాసు రూపశిల్పి ఓ మార్గాలను ఎన్నుకోవడంబాగుంది. కార్యక్రమం చిన్నదిగా కన్పించినా సద్దేశ్యం ప్రశంసనీయమైనది.

## సంఘసేవకు ఎవరైనా సన్మానం పొందారా?

సంఘసేవకులుగా నెల్లూరులో ఎవరైనా సన్మానం పొందారా? నాలుగు మంచి మాటలకు పాత్రులుకాకుంటే కాకపోయారు. ఏ సంఘసేవకులైనా చివాట్లు తినకుండా వుండినారా? అసలు సంఘసేవకు సన్మానాలంటూ అవసరమా? చేసేవారుండవచ్చు. కాని స్వీకరించడం ఉచితమా? ఇటువంటి సందేహాలు ఏకరువు పెడుతూపోతే నిష్కృతి విషయం ఎట్లున్నా ముందు నేను చివాట్లుతినవలసి వస్తుంది!

అల్లూరు వాసి - అతిచురుకైన వ్యక్తి - మాజీ సర్వోదయుడు శ్రీ ఎన్. బాలకృష్ణారెడ్డి నా మొహాన్నే అనేశాడు. నీ మాటలనేవిట్లే చూస్తుంటే నువ్వేదో వ్యతిరేకంగా వ్రాసేట్టున్నావు అనేశాడు. నేను చేసిన తప్పేమీలేదు: శ్రీమతి జె జవాద ఈశ్వరమ్మగారి సన్మానసభ ఆహ్వానాన్ని ఇవ్వడానికొచ్చాడాయన; నేను తెలిసికోవాలని, నిజంగా తెలుసుకోవాలని, ఈశ్వరమ్మగారి సంఘ సేవనుగూర్చి కాస్తచెప్పమని అడిగాను. అందులో అతను వేరేభావాన్ని గ్రహించాడు. నేను గుచ్చి గుచ్చి అడిగి అతన్ని ఆవేశపెట్టడంతప్ప నాకు కావలసిన సమాచారంమాత్రం దొరకలేదు.

27 తేది ఈశ్వరమ్మగారి సన్మానసభ నెల్లూరులో జరిగింది. ఆ వివరాలు వేరేచోట చదువుతారు. జిల్లా పరిషత్తు సభ్యురాలైనతర్వాత, తెలుగుదేశం అధికారానికి వచ్చినపిమ్మట ఈశ్వరమ్మగారు ఆశ్రితులకు చేతనైనసాయంచేస్తున్నదని అప్పుడప్పుడు వింటున్నాను. నేనూ జిల్లాపరిషత్తు సమావేశాలకు హాజరయ్యేవాణ్ణి. జి.ప.లో వున్న మహిళాసభ్యులు ముచ్చటకైనా నోరుతెరుస్తారేమో విందామనుకుంటే నాకు ఆ ప్రాప్తంకలుగలేదు. ఈశ్వరమ్మగారుకూడా కనీసం సాంఘికసంక్షేమ కార్యకలాపాలమీదకూడా ఎప్పుడూ పెదవి కదల్చలేదు.

ఆ సంగతి పోనీండి- సంఘసేవ విషయం ఎట్లున్నా, సంపన్న కుటుంబానికి, అందునా దొడ్డ సంస్థానానికి చెందిన ఒకమహిళ వైటకాలుపెట్టడం, పరిమితంగానైనా ప్రజాహితరంగంలో పాల్గొనడం ముందడుగేనని నా అభిప్రాయం. ఆ విషయంలో ఈశ్వరమ్మగారు అభినందనీయురాలని చెప్పకతప్పదు. మన జిల్లాలో ఆ రోజుల్లో కనకమ్మ, సుదర్శనమ్మ వంటి వ్రేళ్ళమీద లెక్కించదగిన ఏ కొద్దిమందోతప్ప, బయటకొచ్చి పనిచేసిన మహిళలేరీ? 1955లో పఠ్వకరెడ్డి శ్రీదేవమ్మగారు అసెంబ్లీకి పోటీచేశారు. ఇప్పుడు ఈశ్వరమ్మగారు వెలుగులోకి వస్తున్నారు. బహుళా దొడ్డకుటుంబాలనుండి బయటకొచ్చినమహిళలలో ఈశ్వరమ్మగారు రెండవవారుగావుంటారు. కోటగట్టువాసి, ఆత్మకూరుసమితి మాజీ అధ్యక్షుడు శ్రీ వంగూరు వెంకటసుబ్బారెడ్డి కుమార్తె శ్రీమతి సీతఎరారెడ్డి ... వివాహమాడి, 'ఆపైక్' అనే ఆంగ్లమాస పత్రికకు ప్రచురణకర్తగా వుంటున్నది: ఆమెభర్త బ్రహ్మానందరెడ్డి ఆ పత్రిక సంపాదకుడు. ఇటువంటివారు ఇంకా వున్నారేమో నాకుతెలియదు.

ఈశ్వరమ్మగారు సంఘసేవకురాలు కావడంకాదు ముఖ్యం: సాంప్రదాయకమైన సంపన్న కుటుంబీకురాలైవుండి ప్రజాసేవారంగంలోకి ప్రవేశించడమే విశేషం. అందుకు అభినందించాలి ఆమెను!

# నెల్లూరు సంగతులు

(4 పేజీ తరువాయి)

తుందిశికడా. ఆసక్తివుంటే సొసైటీ కార్యదర్శి పి. రామమూర్తిని కలవండి!

### స్పీడ్ బ్రేకర్లు

పొదలకూరు రోడ్డులో స్పీడ్‌బ్రేకర్లు కట్టించమని, లేక్‌వ్యూ ఏరియా యూత్ అసోసియేషన్ కార్యదర్శి శ్రీ కె. వి. చెన్నయ్య కోరుతున్నారు. నెల్లూరులో రోడ్లలోవున్న గుంటలు, గతుకులు చాలక, కొత్తగా ఎందుకండీ కట్టడం?

### ఆర్య వైశ్య మహాసభ

జిల్లా ఆర్యవైశ్య మహాసభ జరపాలని వైశ్యులంతా కలసి తీర్మానించుకున్నారు. దీనికి కన్వీనరుగా మాజీ మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ కంచర్ల సుబ్రహ్మణ్య గుప్త నియమితులైనారు. జులై 12, 13 తేదుల్లో జరుగుతుందట మహాసభ.

### లారీ కార్మికులు

బి జె పి కి సంబంధించిన కార్మిక సంఘం- బి ఎం ఎస్ నెల్లూరులో లారీ కార్మిక సంఘం ప్రారంభించింది. దీనికి గౌరవాధ్యక్షుడుగా కె. భాస్కర్, అధ్యక్షుడుగా మన్నా రామచెంచయ్య, ఉపాధ్యక్షుడుగా ఊరుమిండి మస్తానరావు, కార్యదర్శిగా ఉడతా రమణయ్య, సహాయ కార్యదర్శులుగా ఓబులం అరుణకుమార్, పంణి శివకుమార్, కోశాధికారిగా ముంగర రాజారావు ఎన్నికైనారు.

ఈ సందర్భంగా జరిగిన సమావేశాన్ని శ్రీ బి. వి. రమణయ్య అధ్యక్షించారు. జిల్లా యువమోర్చా అధ్యక్షుడు శ్రీ పి. ఆంజనేయరెడ్డి, రాష్ట్ర బి. ఎం. ఎస్. కార్యదర్శి శ్రీ బి. వి. సాంబశివరావు మాట్లాడారు.

### రుక్మిణీకళ్యాణం

నెల్లూరు, సర్వసాయి నాట్యమండలి రజతోత్సవం ఐటీపీఎల టౌన్‌హాల్‌లో జరిగింది. ఈ సందర్భంగా మధురకవి శ్రీ బెల్లంకొండ వెంకటేశ్వర్లును సన్మానించారు. సభను సాంఘిక సంక్షేమశాఖ డిప్యూటీ డైరెక్టరు శ్రీ పి. వెంకటేశ్వరరావు అధ్యక్షించారు. తెలుగుగంగ స్పెషల్ కలెక్టర్ శ్రీ వెంకటశివయ్య, డి. పి. ఆర్. ఓ. శ్రీ వై. వి. రత్నం, ఏజెంట్ శ్రీ టి. నారాయణరెడ్డి తదితరులు మాట్లాడారు. కళాప్రవీణ శ్రీ రేబాల రమణ సభ నిర్వహించారు.

తర్వాత రుక్మిణీకళ్యాణం నాటక ప్రదర్శన జరిగింది.

### పేద ముస్లింలకు పెళ్ళిళ్ళు

పేద ముస్లిం యువతీయువకులకు పెళ్ళిళ్ళు చేయడానికి నెల్లూరులో ఏర్పడిన 'ముస్లిం మ్యారేజెస్ కమిటీ' క్రమం తప్పకుండా తన కార్యక్రమాలు నిర్వహిస్తూంది. ఇప్పటివరకు వీరు 31 జంటలకు దాంపత్యభాగ్యం అందించారు

మొన్న 27 తేది మరొక 10 మంది పేదలు కమిటీ పుణ్యాన ఒక ఇంటివారైనారు. బారకాసులోని ముస్లిం అంజుమాన్ బిల్డింగ్స్‌లో జనాబ్ ఎస్. అబ్దుల్ ఖాన్ సాహెబ్ అధ్వర్యంలో ఈ వివాహాలు జరిగాయి. కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ పెండ్లి శుభకార్యం ప్రారంభించారు ఎమ్మెల్యే శ్రీ కె.వి. సుబ్బారెడ్డి పాల్గొన్నారు. మ్యారేజెస్ కమిటీ పెండ్లిళ్లు చేయడమేకాక, నూతన దంపతులకు రెండేసి వేల రూపాయల విలువైన ఇంటి సామాన్లుకూడా బహూకరించింది.





Office of the Executive Engineer, Panchayathi Raj, Nellore.

# Tender Notice

No. 2/86-87

Sealed Tenders for Drilling of Bore Wells from the Private Rig Agencies will be received by the Executive Engineer, P. R Nellore upto 3-30 P. M. on 9-5-86 and will be opened on the same day 4-00 P. M. at his office at Nellore by the Executive Engineer, Panchayathi Raj, Nellore, or his Deputy. Applications for Tender Schedules will be received upto 7-5-86 upto 5-30 P. M and Tender Schedules will be issued on 8-5-86.

| S. No. | Description | EMD | Cost of Tender Schedule | Sales Tax |
|---|---|---|---|---|
| | | Rs. | Rs. | Rs. |
| 1. | Drilling of tube well by down the hole hammer ton finished dia of 112 mm (4½'') 0 to 60 Meters. | 5000/- | 50/- | 3/- |
| 2. | -Do- for 150 mm dia (0'') 0 to 90 mts. | 5000/- | 50/- | 3/- |
| 3. | Drilling of bore wells by rotary rig to a finished dia of 300 mm (which may be carried out by pilot bore of suitable dia and then remaining to the required dia) including the insertion of 150 mm dia I D MS onsing pipe 0 to 130 Mts. | 1000/- | 50/- | 3/- |
| 4. | Sinking of 100 mm. dia filter points in Alluvial soils to a depth of 0 to 40 Mts. including hire charges and transportation charges of Drilling set. | 500/- | 25/- | 1-50 |

Note: 1. Onsing Pipe, couplings, G. I. Pipes, and plugs will be supplied by the department at the nearest dept. stores and contractor has to convey from stores to workspot at his cost.

2. Cost of Tender Schedules has to be remitted to the head of account of '003 Engineering Funds Nellore' & Sales Tax' 040 General Sales Tax'.

-M. Subrahmanyam Reddy,
Executive Engineer (PR) Nellore.

# సైదులు సుత్తి కొట్టకయ్యా బాబూ!

జంద్యాల, వేటు, వీరభద్రరావుల ధర్మమా అని ఇంతవరకు "సుత్తి కొట్టకయ్యా బాబూ!" అనడం మామూలైపోయింది. కాని, ఎవరికైనా ముఖస్తుతి

## నవ్విపోతారన్న వెరపుకూడా లేదా అధికారులకు?

చేస్తేమాత్రం "సైదులు సుత్తికొట్టకండి, స్వామి!" అనే వాక్యం ఇటీవల వాడుకలోకి వచ్చింది చిత్రపరిశ్రమలో. ఉగాదినాడు నంది అవార్డుల బహూకరణ సభను ప్రారంభించిన సమాచార పౌర సంబంధాలశాఖ కొత్త కమీషనర్ సైదులు శృతిమించి ఎన్. టి. ఆర్. ను సుత్తి వేశారట. "విశ్వవిఖ్యాత నటసార్వభౌములు విశ్వవిఖ్యాత తెలుగు నేతగా వున్నారు!" అని ఆయన స్తుతించేసరికి సభలో ఓవర్గంవారు కిలకిలా నవ్వుకున్నారట అంతేకాక, ఎన్. టి. ఆర్ ఉచ్చరించే ధోరణిలోనే "విఘ్నానం" లాంటి పదాలు దొర్లించారట; ఎన్.టి.ఆర్. ప్రీతికి పాత్రుడవగలడనే ఆశతో.

సభకు విచ్చేసిన ముఖ్య అతిథుల మీద చల్లిన పువ్వులను వాళ్ళు వెళ్ళిపోగానే ఏరుకుని, పళ్ళెంలో వుంచి, ఆ తరువాత వచ్చే ప్రముఖుల మీద వాటిని చల్లడం ఈ సభలో హైలైట్ అని కొందరి వ్యాఖ్య.

## స్మితా! నీ రాత తారుమారు!

మొదట్నుంచీ సిల్క్‌స్మిత సెట్లో తలబిరుసుతనంతో ప్రవర్తిస్తూంది. అందులో ఇటీవల రెండుచిత్రాలనిర్మాణం చేపట్టాక ఈమె నిరంకుశత్వానికి హద్దూ పద్దూ లేకుండావుంది. "కొండవీటిరాజా" చిత్ర సమయంలో దర్శకునితోనూ, నిర్మాతతోనూ తగాదాపెట్టుకుంది. ఇటీవల వి. కోదండరామిరెడ్డి డైరెక్షన్లో తయారయ్యే "ఒకరాధ, ఇద్దరుకృష్ణులు" చిత్రం సెట్‌లో ఈమె ప్రవర్తన శృతిమించిపోయింది. ఈ చిత్రంలో కమలహాసన్ హీరో, ఆయన నాట్యంలో కాస్తోకూస్తో అనుభవమున్నవాడు. ఒకప్పుడు డాన్స్ డైరెక్టర్ అసిస్టెంటుగానూ పనిచేశాడు. ఆయన సరసన స్మిత డాన్స్‌చేయడానికి బుక్ అయింది. డాన్స్ డైరెక్టర్ ఆమె దగ్గరికివచ్చి మూమెంట్స్ చెప్పబోతే, "నేను షాట్‌లో చేసేస్తాను. నాకేంభర్వా లేదు. ముందు కమల్ కు తర్ఫీదు ఇవ్వండి" అంది. అంతే. అప్పుడా సెట్‌లో వున్నవారంతా విభ్రాంతులయ్యారు. పైగా, టేక్ ముందు డైరెక్టరు "ఫాలఫ్" అంటే, స్మిత "ఫాలాన్!" అనడం మొదలెట్టింది. ఇలా రెండుమూడు సార్లు జరగడంతో స్మితకు ఆ చిత్రంలోనుంచి ఉద్వాసన జరిగింది. ఆమెకు బదులు జయమాలినితో ఆడాన్స్‌ను పూర్తి చేశారు.

స్మిత ఇప్పుడు తీస్తున్న రెండుచిత్రాలలో ఒకదానిపేరు "బ్రహ్మ! నీ రాత తారుమారు!", స్మిత బాధితులు చాలమంది "స్మితా! నీ రాత తారుమారు!" అంటున్నారు పరిహాసంగా,

ఇంతకాలంగా స్మిత ఎందరో నిర్మాతలను బాధపెట్టింది, ఆ కష్టాలేమిటో నిర్మాతగా ఈమెకు తెలిసివస్తాయి. అప్పటికైనా పశ్చాత్తాపపడుతుందోలేదో!

### మాజీ బాలనటుడి ఖైదు

"పాపం పసివాడు" వగైరా చిత్రాలలో బాలనటుడుగా అందరికిపరిచితుడైన మాస్టర్ రాము వయసు ఇప్పుడు 20. ఇతను ఒకకొట్టులోనుంచి 'వీడియో', కలర్ టి. వి. సెట్‌ను అద్దెకు తీసుకెళ్ళి, మళ్ళీ వాపసుచేయలేదు. మోసం చేశాడన్న అభియోగంమీద ఏప్రెల్ 21 న ఖైదుచేయబడ్డాడు. అతనింట్లో 7 వీడియో టేప్‌రికార్డర్ డెక్‌లు, కలర్ టెలివిజన్ సెట్‌లను పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. దర్యాప్తు జరుగుతోంది. రాము ఇటీవల "పెరుమై" అనే తమిళ చిత్రంలో నటించాడు.





'జీవనపోరాటం'లో గుమ్మడి, నరేష్, శోభన్‌బాబు, దేవి, పుష్పలత, రజనీకాంత్

# కుమారులచిత్రాలేమౌతాయో?

నందమూరి బాలకృష్ణ నటించిన "పట్టాభిషేకం, నిప్పులాంటి మనిషి, సీతారామ కల్యాణం" వగైరా చిత్రాలు ఆశించినంత విజయం సాధించక పోవడంతో హీరో కొడుకులు నటించే చిత్రాలను కొనుగోలు చేయడానికి కొనుగోలుదారులు తటపటాయిస్తున్నారు. అన్నపూర్ణా స్టూడియోస్‌వారి "విక్రమ్" అక్కినేని నాగేశ్వరరావు కొడుకు నాగార్జున హీరోగా తయారైన తొలిచిత్రం. ఎందుకో ఏమో- ఈ చిత్రాన్ని మరమ్మత్తు చేస్తున్నారట. ఈ చిత్రంమీద హీరో కొడుకులతో తయారయ్యే మిగతా చిత్రాల భవితవ్యం ఆధారపడిఉంది. రామానాయుడు తన కొడుకు వెంకటేశ్‌తో నిర్మిస్తున్న చిత్రం మూడు వంతులకు పైగా పూర్తయింది, కొనుగోలుదారులు రాకపోయినా స్వయంగా విడుదల చేసుకోడానికి పంపిణీ సంస్థ ఉంది రామానాయుడికి బాలయ్య తన కొడుకు తులసీరాంతో "పసుపుతాడు" నిర్మాణం ప్రారంభించాడు. కృష్ణ తన కుమారునితో ఓ చిత్రానికి సన్నాహాలు చేస్తున్నాడు. గిరిబాబుకూడా తన కొడుకు హీరోగా ఓ చిత్రాన్ని తీస్తాడట.

ఇంకా ఎందరు నటుల కొడుకులు హీరోలవబోతున్నారో! ఎంతమందిని చూసే ఓపిక ఉంటుంది జనానికి?

### నెల్లూరీయుడు రూపొందించే "ఆనంద తాండవం"

శ్రీ సత్పురి షా ఫిలిమ్స్ అధినేత, స్వర్గీయ శంకరరెడ్డి బంధువు, డాక్టర్ ఎ రఘురామిరెడ్డి సాహిత్యపిపాసి సంగీత నృత్యాభిమాని; తెలుగు ప్రేక్షకులందరూ గర్వించే పరమోత్కృష్టమైన చిత్రాన్ని నిర్మించాలని ఆయన తపన. తానే కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం వహిస్తూ నిర్మించిన "ఆనందతాండవం"లో రసవత్తరమైన కథ ఉంది; సాహిత్యం, సంగీతం, నృత్యాలు ప్రేక్షకులను రసమయ జగత్తుకు తీసుకెళ్లే స్థాయిలో ఉన్నాయి. కేవలం నృత్యాలకోసమే 30 లక్షలకు పైగా వెచ్చించారు. అవార్డులతో పాటు అత్యధిక ఆదరణ పొందగల ఈ దృశ్యకావ్యంలో దీప, మోహన్,

> మా మద్రాసు సినీ ప్రతినిధి

సత్యనారాయణ, లక్ష్మి, సరిత, సుబ్రహ్మణ్యం, వెంకటాచలపతి, ఆస్ట్రేలియా వాసి మర్రే, ఉమామహేశ్వరి నటించారు. మాటలు: రఘురామిరెడ్డి, వి. కె. ఈశ్వర్. సంగీతం: ఎల్. వైద్యనాథన్. కళ: కళాధర్. కెమెరా: మధు అంబట్, సంకలనం: కరుణానిధి.

### డైరెక్టరు ఇంట్లో దోపిడి

బొంబాయిలోని ప్రముఖ దర్శకుడు బసు చటర్జీ ఇల్లు; మధ్యాహ్నం నాలుగు గంటలైంది. కాలింగ్‌బెల్ హఠాత్తుగా

కొరవ 11వ పేజీలో

# ★★ పెండ్లిండ్లు ★★

## హైదర్ కుమార్తె

నెల్లూరు మునిసిపాలిటీ మాజీ వైస్ ఛేర్మను, 'లంగర్' మార్కు యుక్తైన సరదా మిత్రుడు శ్రీ హెచ్ ఎం హైదర్ కుమార్తె రెహనా షహీ‌; హైదరాబాదు అడ్వొకేటు హబీబుర్ రహమాన్ బి. ఎస్‌సి., బి. ఎల్. వివాహం 27 తేది పినాకినీ తీరానగల ఎం. జి. ఎం. భవనంలో జరిగింది.

## కుమార్ కుమారుడు

రూపశిల్పి శ్రీ కుమార్ కుమారుడు, నెల్లూరు న్యాయవాది రవి; బుచ్చి- శ్రీ అరికాటి వెంకయ్య కుమార్తె కామేశ్వరమ్మ (బి. ఎ.) పరిణయం 25 తేది బుచ్చిరెడ్డిపాలెంలోని పైజా రామయ్య-రమణమ్మ కళ్యాణసదనంలో జరిగింది.

## తూమాటివారిపాళెం పెండ్లి

కనిగిరి తాలూకా తూమాటివారిపాళెం వాసి; నెల్లూరు జిల్లాబోర్డు మాజీసభ్యుడు; కీర్తిశేషుడు నలమోతు చెంచురామానాయుడుగారి అంతరంగిక అనుచరుడు, ఖద్దరుధారి, అకాలమరణం పాలైన తూమాటి వెంకటప్పనాయుడు మనుమరాలు; అంటే శ్రీ తూమాటి జగన్మోహన్ చౌదరి కుమార్తె రాజేశ్వరి (బి. ఎస్‌సి.); నిడమలూరు వాసి శ్రీ బెజవాడ నారాయణ కుమారుడు నరసింహరావు ఎం.ఎస్‌సి. (అగ్రి) వివాహం గత 4 తేది తూమాటివారిపాళెంలో వధువు ఇంట వైభవంగా జరిగింది.

## ఎం. ఎస్‌సి. (అగ్రి) లు

నెల్లూరు సాహిత్య సాంస్కృతిక కళా కార్యక్రమాలలో అత్యంత శ్రద్ధాసక్తులతో పాల్గొంటూ, నెల్లూరీయుడా అన్నంతగా నెల్లూరు ప్రజలతో పెనవేసుకపోయిన అతిపసల్ జిల్లా జడ్జి శ్రీ ఎ. వెంగళరెడ్డి కుమారుడు, ఎస్. బి. ఎం. పెస్టిసైడ్స్ కంపెనీ ప్రతినిధిగా నెల్లూరులో పని చేస్తున్న సురేంద్రనాథరెడ్డి ఎం. ఎస్‌సి. (అగ్రి); బాపట్ల కాలేజి లెక్చరర్ శ్రీ డి. రామారావు కుమార్తె పార్వతీదేవి ఎం. ఎస్‌సి. (అగ్రి) వివాహం గత 4 తేది నెల్లూరు శ్రీ వెంకటేశ్వర కళ్యాణ మంటపంలో జరిగింది.

## గూడూరు పెండ్లిండ్లు

గూడూరు శ్రీ అనపల్లి జనార్దనరెడ్డి కుమార్తె నివేదిత; చిత్తూరుజిల్లా బిగినపల్లి వాసి శ్రీ కె జగన్నాథరెడ్డి కుమారుడు, హైదరాబాదు ఆకాశవాణీయుడు పూర్ణచంద్రారెడ్డి పరిణయం గత 4 తేది గూడూరు దువ్వూరు నారాయణరెడ్డి కమ్యూనిటీహాలులో జరిగింది.

• • •

గూడూరు వెంకటలక్ష్మి ప్రింటర్స్ యజమాని శ్రీ గ్రిద్దలూరు పెంచలయ్య పుత్రుడు, తెనాలి ఐ. టి. ఐ. అధ్యాపకుడు శివకుమార్ ఎల్. ఎం. ఇ. ఎ. ఎం. ఐ. ఇ., వంజివాక, శ్రీ ఒంటిమిట్ట వెంకటరమణయ్య పుత్రిక విజయ మంజుల కళ్యాణం గత 3 తేది గూడూరు జి. ఎస్. రాయలు కళ్యాణకూటంలో జరిగింది.

## వావిలేటిపాడు వివాహం

నెల్లూరుతాలూకా వావిలేటిపాడు ఉపసర్పంచ్, శ్రీ సయ్యద్ నిజాముద్దీన్ కుమారుడు అప్సర్‌బాషా; జిల్లాపరిషత్తు కార్యాలయ సూపరింటెండెంటు శ్రీ మహమ్మద్ ఇక్బాల్ కుమార్తె జమ్రుద్ వివాహం గత 6 తేది వరుని స్వగృహంలో ముస్లిం సాంప్రదాయబద్ధంగా జరిగింది.





## గ్రంథ సమీక్ష

(4వ పేజీ తరువాయి)

దానిలోని పద్యాలనడకను మనకు స్ఫురణకు తెస్తుంది. "ఎవ్వతె వెక్కడిదానవు, నివ్విధి నీ వెందు కేగుదు, ఇద్ధియ నాకున్ అవ్వా చెప్పుమటంచన" అను పద్యం మనుచరిత్రలోని "ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ యొంటిచరించెదు ఓటలేక" అను పద్యాన్ని పోలివుంది.

"అటజనికాంచె రాజసుతు
 డంబుజ సామ్యకరాంఘ్రి యుక్తసన్
 నిటలకటాక్ష, న్నమ్రదుల నీల
  సరోజ విలోచనాంచిత
 కుటిలనఖాగ్రయుక్తను,
  వకుండితకోశ రతీసమానకున్
 చటుల శశాంక సామ్యముఖ
  శ్యామను పీనపయోధరాన్వితన్"

అను పద్యంలోని ప్రారంభం మనుచరిత్రలోని "అటజనికాంచె భూమిసురు డంబరచుంబి" అనే పద్యంవలెవుంది. పద్యంలోని విశేషణాలు ప్రవరుడు చూచిన వరూధినిని పోలివున్నాయి. ఇందు పాతివ్రత్యమహాత్మ్యము చక్కగా వివరించబడినది. పీరుడయినవారి లక్షణాలు, ధర్మసంరక్షణకోసం రాజు నిర్వహింపవలసిన కనీసధర్మాలు వివిధ ధర్మసూత్రాలు మిక్కిలి హృద్యంగా వివరింపబడినవి.

"అతివయు గయ్యాళియైనను పురుషుని
  కోరిక లెన్నడు తీరబోవు
 పతి యేదిచెప్పిన, వ్యతిరేకముగజేయు
  తరుణితోకూడుట నరకమగును
 దంపతులిద్దరు తమ మదులొకటిగా
  చేసిన సుఖములు చేకొనుదురు"

వంటి ధర్మాలు, సుభాషితాలు కావ్యం నిండా వున్నాయి. "విశ్వశ్రేయ కావ్యమ్". కావ్యం విశ్వం యొక్క శ్రేయస్సుకొరకు రచింపబడునని ఆలంకారికుల ఉవాచ. ప్రస్తుతంలో ప్రవర్తిల్లుచున్న దుష్కృత్యాలు, దురహంకారపూరిత హింసాత్మక చర్యలు, యువత, యువకుల అజ్ఞానపూరితమైన ప్రవర్తన మొదలైనవి సమాజశ్రేయస్సును కాంక్షించువారికి విచారాన్ని కలిగిస్తాయి. ఇటువంటి పుస్తకాలను చదువుటవల్ల ప్రజలలో మనస్సంయమనం, శాంతి, దాంతి, చిత్తచాంచల్య నివారణం కలుగునని యువతీ, యువకులు సన్మాన ప్రవర్తకులగుదురని, కవిగా, సంఘ శ్రేయస్కామిగా రామకృష్ణయ్యగారు ఆశించినారు. వారి ఆశ నూటికి నూరుపాళ్ళు నెరవేరాలని మనం ఆశిద్దాం.

## సినిమా

(9 వ పేజీ తరువాయి)

మోగింది, పనిమనిషివెళ్ళి తలుపు తీసింది ఒక బుట్టనిండా పువ్వులతో నలుగురు యువకులు నిలబడివున్నారు.

"డైరెక్టరుగారి అభిమానులం మేము. వారికి పువ్వులుఇచ్చిపోదామనివచ్చాం" అన్నారు ఆగంతకులు.

"అయ్యగారు ఇంట్లోలేరు." అంది పనిమనిషి.

"సరే. అయితే, ఈ పువ్వులబుట్టను ఎక్కడ పెట్టమంటావు?" అడిగారు వాళ్ళు.

"లోపలికి రండి." అంటూ అడ్డు తొలగింది పనిమనిషి.

ఆ నలుగురూ లోపలికి జొరబడ్డారు. ఒకరు చివాలున రివాల్వర్‌తీసి, పనిమనిషి నుదుటకద్దించారు. వరొకరు ఎక్కడి టెలిఫోన్ తీగను కోసేశారు. ఇంతలో మిగతా ఇద్దరూ హాలులోకి ప్రవేశించారు. ఆ డైరెక్టర్ భార్యను, కూతుర్ని బెదిరించి తాళాలు లాక్కున్నారు. దాదాపు ఎనభైవేలరూపాయల రొక్కం, కొన్నినగలు బీరువాలలోంచి దోచుకున్నారు.

టి. వి. సీరియల్ "రజని" డైరెక్టు చేసే బసు చటర్జీ, సంఘ విద్రోహశక్తులకు పాల్పడే వారిగుట్టును బట్టబయలు చేస్తున్నకారణంగా ఎవరో గిట్టనివాళ్ళు ఈ దోపిడికి పాల్పడ్డట్టు భావించబడుతోంది.

## ఎం. ఎల్. సి. పదవి వదలుకున్న నటీమణి

"కరుణామయుడు" వగైరా చిత్రాలలో నటించిన వెన్నిరాడై నిర్మల అనే నటిని (వయసు 30) తమిళనాడు ప్రభుత్వం ఎం.ఎల్.సి.గా నామినేట్ చేసింది. కాని ఈమె 1981 లో మద్రాసు హైకోర్టులో దివాలా పిటిషన్ (ఇన్‌సాల్వెన్సీ) దాఖలు చేసిందట. అందుచేత,ఆమె ఎం.ఎల్.సి.గా అనర్హురాలంటూ గోపాలన్ అనేవ్యక్తి స్టే ఆర్డర్ తెప్పించాడు. ఇంతలో నిర్మల తాను చెల్లించాల్సినబాకీమొత్తం తొమ్మిది లక్షలు కోర్టులోకట్టి, ఇన్‌సాల్వెన్సీని రద్దుచేయించింది. అయినా, ఎందుకో ఏమో వెంటనే తన ఎం. ఎల్. సి. పదవికి రాజీనామాచేసింది. మొత్తంమీద ఈ విధంగానైనా ఆమెవద్దనుంచి తొమ్మిది లక్షల బకాయి సొమ్మును రాబట్టుకో గలిగినందుకు ఆమెకు అప్పులిచ్చిన వారు ఎంతో సంతోషిస్తున్నారు.

నిర్మలలాగే మరికొందరు తారలు కూడా ఎంతోమందికి బాకీపున్నారు. వాళ్ళందరికీకూడా ఇలా ఎం. ఎల్. సి. పదవులు ఇప్పిస్తే, తమ బాకీలు వసూలు చేసుకోడానికి వీలవుతుందని అప్పుల వాళ్ళు జోక్‌గా చెప్పుకొని నవ్వుకొంటున్నారు.

## కొన్ని కొత్త చిత్రాల టైటిల్స్

హీరో కృష్ణ స్వీయ దర్శకత్వంలో నిర్మించే పద్మాలయవారి తదుపరి భారీ చిత్రం "రాజకానవం". లక్ష్మీభవానీ ఆర్ట్స్ "అడవిలో ఆడపిల్ల", నీరజ మూవీస్ "కటకటాలదేవత", వెంకటరమణ పిక్చర్స్ "ఖైదీ విక్రమ్", శ్రీదేవి సినీ క్రియేషన్స్ "మాఊరి పేరంటాళ్లు", విజయలక్ష్మి ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ "తెల్లచీర - మల్లెపూలు", ఆర్. కె. యూనిట్స్ "బ్రహ్మరుద్రులు". శివప్రియ క్రియేషన్స్ "డిస్కోఆనంద్" దినకర్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "సూర్య దేవృత్యకోదైవం". వజ్రచక్రాయ మూవీస్ "అయ్యప్పతో అరవైరోజులు", సరూ చిత్రాలయ "అర్ధరాత్రి ఆడది".

పాతచిత్రాల పేర్లతోనే మరికొన్ని కొత్తచిత్రాలు తయారవుతున్నాయి కథల కరువుకు వలెనే క్రమక్రమంగా టైటిల్స్‌కి కూడా కరవు ఏర్పడేలా ఉంది!

## "మన్నెంలో మొనగాడు"

భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "మన్నెంలో మొనగాడు" చిత్రానికి ఏప్రెల్ 2నుంచి 10 వరకు తడసగ్గరజరిగిన షూటింగ్‌లో రెండు ఫైట్స్, ఒక పాట మరికొన్ని సన్నివేశాలు చిత్రీకరించారు. అర్జున్, కొత్తతార వెన్నెల, గొల్లపూడి మారుతీరావు, వై. విజయ, కొత్త విలన్ మదన్ నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకత్వం కోడి రామకృష్ణ. నిర్మాత: ఎస్. గోపాల్ రెడ్డి.

## మాజీ తారలకు భర్త్సయోగం

నటి, నర్తకి వైజయంతిమాల భర్త - క్లిక్ వాలి నిత్రానులో బి. సరోజాదేవి భర్త హర్ష బెంగళూరులో ఒకేనెల పరమ పదించారు.



పల్లూరు గ్రామపంచాయతి

## టెండర్ నోటీసు

మా గ్రామపంచాయతికి 1986-87 సం॥ నకు ఈ దిగువ తెల్పిన వస్తువులు సరఫరాచేయుటకు 5-5-86 తేది సా. 4 గం.కు టెండర్లు స్వీకరించి అదేరోజు హాజరయిన టెండరుదార్ల సమక్షమున 4-30 గంటలకు తెరువబడును. ధరావత్తు చెల్లించిన రశీదు టెండరుకు జత పరచి సీల్డు కవరులో పంపవలెను.

-: వివరము :-

1. పంచాయతీ వీధి దీపములకు కావలసిన విడి భాగములు 4" ట్యూబ్ లైట్ సెట్టు దఫాలవారీగా సప్లయిచేయుట ధరావత్తు రు. 25/- లు.

2. హ్యాండు బోరు విడి భాగములు దఫాలవారీగా సప్లయిచేయుట. ధరావత్తు రు. 25/- లు. మిగతా వివరములు పంచాయతీ ఆఫీసు పనిచేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

-దువ్వూరు రవిచంద్రారెడ్డి, సర్పంచ్

పెనుబర్తి గ్రామపంచాయితి
నెల్లూరు మండలం

## టెండరు నోటీసు

పెనుబర్తి గ్రామపంచాయితికి 1986-87 సంవత్సరమునకు 1) 40 వాట్స్ ట్యూబులైట్లు 4 అడుగులు 2) 40 వా॥ బల్బులు 3) చోకులు 4) స్టార్టర్లు 5) హోల్డర్సు 6) వైరు 7) రక్షిత మంచి నీటి పథకముయొక్క పైపులైనుకు సంబంధించిన కప్లింగ్‌లు, జాయింట్లు 8) మరియు సదరు పథకముయొక్క కరెంటు మోటారునకు స్పేర్‌పార్టులు వగయిరా సామానులు దఫాలవారీగా సప్లయిచేయుటకు ఆథరైజ్డ్ డీలర్లనుండి సీలువేసిన టెండర్లు 12-5-86 తేది మధ్యాహ్నం 3 గంటలకు పెనుబర్తి గ్రామపంచాయితీ కార్యాలయమునందు సర్పంచ్ గారిచే తీసుకొనబడును. టెండర్లు అదేరోజు సాయంత్రము 4 గంటలకు టెండరుదార్ల సమక్షమున పరిశీలింపబడును.

టెండరు ధరావత్తు రూ. 50/-లు

మిగతా వివరములు పంచాయితీ ఆఫీసులో తెలుసుకొనవచ్చును.

-గాలి వెంకురెడ్డి సర్పంచ్

## జిల్లావార్తలు

(1 వ పేజీ తరువాయి)

కలెక్టర్ శ్రీ అన్వర్ హుసేన్, డిప్యూటీ కలెక్టర్ శ్రీ ఆనిరి శ్రీనివాసులురెడ్డి నాయుడుపేటసమితి అధ్యక్షుడు శ్రీ ఎం. రాఘవరెడ్డి, ఎమ్మెల్యేలు శ్రీ ఒ. నెయ్య, శ్రీ దిగ్విజయసెన్, కళ్ళా తెలుగుదేశం కార్యదర్శి శ్రీ వేనటి మునిరెడ్డి తదితరులు కూడా పాల్గొన్నారు.

### తోడేరు హత్య కేసు కొట్టివేత

పొదలకూరు తాలూకా తోడేరు గ్రామంలో 84 ఏప్రెల్ 11 తేది జరిగిన ఒక హత్యకేసును, అడిషనల్ జిల్లాజడ్జి శ్రీ ఎ. వెంగళరెడ్డి కొట్టివేశారు.

అటుపూరు పెంచలయ్య అనే వ్యక్తి తనభార్య పెంచలమ్మను పొడిచి చంపాడని ప్రాసిక్యూషన్ ఆరోపించింది. అతే న్యాయమూర్తి నేరం నిరూపణ కాలేదని తీర్పుచెప్పి, పెంచలయ్యను నిర్దోషిగా భావించి, కేసు కొట్టివేశారు. ఈ కేసులో ప్రాసిక్యూషన్ పక్షంగా పి. పి. శ్రీ టి. రామమూర్తి ముద్దాయిపక్షంగా శ్రీ పి. విజయకుమారరెడ్డి, శ్రీ జి. రవీంద్ర వాదించారు.

### కన్యాపహరణం కేసు కొట్టివేశారు.

గూడూరు ఆంజనేయస్వామి గుడి వీధిలో నివశించే ఒక పదహారేళ్ళ పడతిని అపహరించుకొని పోయాడన్న ఆరోపణకు గురైన పూలరాజు అనే యువకుడు నిర్దోషి అని గూడూరు అసిస్టెంట్ సెషన్స్ జడ్జి శ్రీ దాలవ సుబ్రహ్మణ్యం తీర్పుచెప్పారు.

ప్రాసిక్యూషన్ కథనం ప్రకారం పూలరాజు తాను పనిచేస్తున్న మెస్ యజమాని కూతుర్ని అపహరించుకొని పోయాడట. ఆమెను కొన్నాళ్ళు తిరుపతి, చిత్తూరు జిల్లాలో వుంచి, తర్వాత తనస్వగ్రామమైన చంగలాపురంలో కాపురం పెట్టాడట. ఇదితెలిసి, ఆ యువతి తల్లిదండ్రులు అక్కడికివెళ్ళి ఆమెను తిరిగి తెచ్చుకున్నారట. రాజుపై పోలీసులు కిడ్నాపింగ్ కేసు పెట్టారు.

పోలీసు కేసు రుజువుకాలేదనిభావించి న్యాయమూర్తి కేసుకొట్టివేశారు. ఇందులో ప్రాసిక్యూషన్‌పక్షంగా అడిషనల్ పి పి శ్రీ వై. రామారావు, ముద్దాయి పక్షంగా న్యాయవాది శ్రీ వాకాటి సుబ్బరామరెడ్డి వాదించారు.

### జనవాణి

(3వ పేజీ తరువాయి)

పోలీసులు పిడించుకొని తింటున్నారు రాత్రిపూట లారీ పోలీసుకు కన్పడ కూడదు-వేలగాడివలతో తేడిచిక్కినట్లే! స్టోన్ హౌస్ పేట, చిన్నబజారులలో ట్రాఫిక్ నిషేదాన్ని తప్పించుకుని పగటిపూటకూడా లారీలు తిరుగుతున్నాయంటే పోలీసుల లంచాల జాఢ్యమే కారణం. నడరోడ్డునైనా లారీనిలపండి-వారేమీ అనరు; అయితే చేయి లోపలకు దాగానే పరిరూపాయలనోటు రాలిపడాల్సిందే!

ఈ పదులు, ఇరవైలతో పోలీసులు బాపుకునేదేమీవుండదు. దానివల్ల లారీ లకుకూడా పెద్దగా నష్టంలేదు. అయితే, ఈ అల్పసక్తుల్ని కక్కుర్తివల్ల పోలీసు అంటే ప్రజలలో చులకనైపోతూంది. అంతే!

నెల్లూరు -సి. ఎం. కె.

### మేము-మీరు

(3వ పేజీ తరువాయి)

తాళమ్మ దేవాలయం ముందు తన చుట్ట కాల్చుకునేందుకు నిప్పుకోసం ఆగి "తాళా నిప్పు ఇవ్వు" అంటే తాళమ్మ ఆయన చుట్టను వెలిగించేరట. ఇది నిజమో కాదో నాకుతెలియదు.

-పెరుమారెడ్డి జయరామిరెడ్డి
కెమిస్ట్రీ విభాగం,
ఫ్లోరిడా అట్లాంటిక్ యూనివర్సిటీ
ఫ్లోరిడా (యుఎస్ఏ)

★



[illegible] 17/170 [illegible]